# అభినవసరస్వతి

సంపుటము ౹౹౹ర | ధాతృనామ సంవత్సరము ఆశ్వయుజ మాసము | సంచిక ౭

## —* కృతివిమర్శము *—

కోదండపాణి— ఇది యొక యర్ధశతకము. అబ్బరాజు హనుమంతరావు గారిచే విరచితము. కొడుకు కోదండపాణి యౌవనమునఁ బరలోకగతుఁ డగుటయు హనుమంతరావుగా రవనిజాపతియగు కోదండపాణి నడ్డము పెట్టుకొని యాత్మజ నామసంకీర్తనము చేయుచు నర్ధశతకందములతో నలమటించెను.

కం. తియ్యని చక్కెరకును వెను
దియ్యని పలుకులను పార్వతీపరిణయమున్
తియ్యగ వ్రాసిన నాసుతు
నియ్యావ కోదండపాణి! మృదుతరవాణీ!

కం. నాకొమరుని కృతిపుత్రిక నాకుం బ్రియపౌత్రి. దానినవరూపలతల్
ప్రాఁకింపు లోకతరువున వీఁకను గోదండపాణి! విలసితవాణీ!

అనుపద్యములవలన నీ కొమరుఁడు పార్వతీపరిణయమను గ్రంథముఁగూడ వ్రాసి నట్లు కనఁబడియెడిని. కనుకనే పాప మీయన పొరలివచ్చు పుత్రశోకమును బద్యార్ధ శతకమునఁ బ్రకటించినాఁడు. ఈయన దాశరథిచరిత్రాదు లిదివఱకు వ్రాసి కవితా వ్యాసంగము చేయుచున్నను 'వెనుదియ్యని-యియ్యవ' మొదలగు నపశబ్దములు దుఃఖ వేగమున వ్రాసియుండుటచేఁ గాఁబోలు పడియున్నవి.

క. వాణీ స్తనసంపదగల మాణిక్యాంగద యొకొండుమానిని తీనదా
పాణిగ్రహింపక చనఁ దగవౌనె కోదండపాణి! అతులితవాణీ!

అను పద్యమునుబట్టి హనుమంతరావుగారి యాత్మజుఁ డాసన్నవివాహుఁడై యసువులు విడిచినట్లు కనుపట్టెడిని. అందువలననే,

క. నీముద్దు చిఱునగవు నెమ్మోముందామరయు మోహాముం దీరంగన్
నాముందు కనఁబఱచు కడుప్రేముడిఁ గోదండపాణి! మృదుతరవాణీ!

క. మోముంజందురునేకా దా మోకాల్దాఁకు చేతులందము నడసాం
పామోదముతోఁ జూపుము సామీ! కోదండపాణి! సరసపువాణీ!

క. తీంద్రమగు బ్రహ్మతేజముఁ బుంద్రద్వయముఁ గలయట్టి ముఖపద్మ
వాంద్రకు లేమిం జూపుము తండ్రీ! కోదండపాణి! తతహితవాణీ! [ము నే

అని యాత్మఖుం దలఁచుకొనితలఁచుకొని కవులగుటఁ గందములతో వందురిరి. కొన్నిపద్యము లిందుఁ గొడుకు కోదండపాణికిని గొన్ని కోదండరామునకును గొన్ని యుభయులకును సమన్వయించును. కవిత్వము కరుణరసభూయిష్ఠము, మృదుమధురపదగుంఫితము.

సతీస్మృతి— ఇది రాజమహేంద్రవరంబున దొరతనమువారి బోధనాభ్యసన పాఠశాలయందుఁ బ్రధానాంధ్రోపాధ్యాయుఁడగు వడ్డాది సుబ్బారాయకవిచే రచియింపఁబడినది. రెండవకూర్పు 2000, 1912. 0-4-0 వెల. ఈయన సూక్తివసుప్రకాశకము భామినీవిలాసము సుమనోమనోజ్ఞము లోనగు ననేకగ్రంథములను రచించిన మహాకవి. 4 కళత్రము లీకవికి నష్టమయినవి. అనష్టికాలమం దాచరించిన హాహాకారమే యీసతీస్మృతి. పవిత్రమైన చరిత్రగలిగి బహిఃప్రాణమైన భార్య పరలోకమున కేగినపుడు భర్త కవియగుచో నామెపై రాచందార్కమవనిపై నుంచుటకుఁ గావింపఁదగిన కార్య మిదియే. పూర్వకాలమునఁగూడఁ గళత్రవియోగము గలిగినపుడు పండితరాయాది ప్రౌఢకవు లిట్లు పచరించియుండిరి. ఈవసురాయకవి తెనిఁగించిన భామినీవిలాసము పండితరాయల భార్యాస్మృతియే యైయున్నది. ఈకవి కవిత్వము చాల మంచిది. జగత్ప్రసిద్ధము. పద్యత్రయ మిందుఁ బరికింతురుగాక.

సీ. తలవాకిలి గనంగ ద్వారంబునకు నీవు
పెట్టినముగ్గులు బెంగగొలుపు.
నడవసూచిన నందెగడియాలు మొరయ నీ
వడుగుంచు కుట్టిమం బెడఁదఁ గలఁచు.
పడకిల్లు తిలకింప నడపంబు మొద లీవు
వాడెడువస్తువుల్ గోడుపెనుచు.
పెరడు గాంచిన నీవు పెంచిన మొక్కలు
కడుపుఁ బ్రేవులఁ గలఁకలను గోయు
అకటకట! మున్ను సర్వదా హర్షమొసఁగు
సొంతయిల్లిప్పు డిట్లెంతొ వంతగూర్చు.
ముదము నీతోడఁ గొనిపోయి త్రిదివమునకు
శోక మిట నాకు విడిచితే సుబ్బలక్ష్మి!

సీ. చిగురాకువంటి నీచేయిసోఁకదుగాన
తరుణి! ఈతనువు వ్యర్థంబ యింక.

అమృతంబునట్టి నీహాస మొల్కదుకాన
కల్కి ! ఈచూపు శుష్కంబ యింక.
పానకంబట్టి నీపల్కు దొల్కదుకాన
వెలఁది ! ఈవీను దా విఫలమింక.
చవులుట్టు నీవంట సంభవింపదుగాన
రమణి ! ఈరసన నీరసము యింక.
పుక్కిటను దమ్ములముఁ దావిపూఁత మేన
సరులు దుఱుమునఁ గల నీదు సరస సకియ !
కలుగ, దటుగాన హీన మిూఘ్రాణ మింక.
పంచతయు కాక నినుఁబాయు బ్రతుకు బ్రతుకె ?

మ.- మఱపే బంధువియోగదుఃఖమునకున్ మందంచుఁ జింతించి నీ
ఒఱపో ర్పొద్దిక యొప్పిదంబుఁ బ్రణయం బొక్కింతయున్ బుద్ధినె
త్తఱినేఁ జొన్పకయున్న వానికవె ప్రస్తావంబులం దోఁచి నా
నెఱఁకుల్ అంపపుఁగోఁత గోసెడు సదా. నే నెట్లుల్లోర్తుం జెలీ !

సుబ్బలక్ష్మియను నీయింతికంటె ముష్న చన్న భార్యకుఁ బ్రహ్లాదుఁడను పట్టి యుండ నాతని నీపె యెట్లు చూచినదియు

ఉ. ఆదరువై సపత్నిసుతుఁడన్న విభేదము లేక పెంచెఁ దా
గాదిలితల్లియై, మునుపుగా దిపు డీతఁడు మాతృహీనుఁడం
చాదఁ దదీయ మాతులముఖాప్తులు పొక్కెద రీవు తీఱఁ బ్ర
హ్లాదము దైన్యముం గని. ప్రియా ! ఇది తెల్పదె నీదు శీలమున్.

అనుపద్యమునఁ దెలుపఁబడినది. ఈకవి విజయలక్ష్మియను వేఱొకభార్య విశిష్టరోగయైయున్నపుడు

శా. భూమిన్ మా యిడుముల్ దొలంపఁ బరమాప్తుల్ లేనెలే రుండి
సామర్థ్యం బరు. దద్దిగల్గినను నీసాహాయ్య మావశ్యకం. [రా
బేమం దీమెకు మేలొ వెజ్జునకుఁ దంద్రీ ! దానిఁ దోఁపించి వే
క్షేమారోగ్యములిచ్చి మద్విజయలక్ష్మిం బ్రోవు సర్వేశ్వరా !

మొదలగు బహుపద్యములతో భగవత్ప్రార్థనఁ జేసియుండెను. విక్రమోర్వశీయ వేణీసంహార ప్రబోధచంద్రోదయాది సంస్కృతనాటకము లీ కవిచే నాంధ్రీ

కృతములు. ఈగ్రంథము లన్నియు వలయువారు వడ్డాది సుబ్బారాయకవిగారు, రాజమహేంద్రవరమని వ్రాసికొనవలెను.

సుతస్మృతి— ఇందుఁ గృష్ణా! అపదుద్ధారకా! అను మకుటముతోడి 100 పద్యముల శాంతిపాఠముకూడఁ దుదను జేరియున్నది. ఇది విద్యావయోవంతుఁడయి వివాహితుఁడై యకాలమృత్యుగోచరుఁడైన ప్రహ్లాదమూర్తియను దమ యేకపుత్రుని స్మరించుచు వడ్డాది సుబ్బారాయఁడుగారే 1908 సం॥ రచించిరి. దీనిది 2 కూర్పు 1000 ప్రతులు తీసిరి. వెల రు 0-4-0. ఈప్రహ్లాదమూర్తి ప్రథమశాస్త్రపరీక్షకుఁ జదువు చున్నవాఁడు. కనుక నే తండ్రి

మ. రచియింతుర్ భవదీయజీవనచరిత్రం బాంగులోభాష, నే
రిచితిన్ వ్రాసెదునట్టి తత్క్రమము నర్థిన్, స్వీయజన్మాదిక
ప్రచురోదంతము నాకుఁ దెల్పరె దయన్ బాబయ్యగా రంటి. హా
వచియింతుం దుది నిట్లు నీచరిత నేఁ బ్రహ్లాద! యేకాత్మజా!

మ. తగ నార్జించితి పుంగుటూరను నుపాధ్యాయత్వముం జేసి వే
సఁగిలోఁ గాలెజిలేనినాళులను వత్సా! ఆయురూపాయలన్.
తెగెఁ గాఁబోలు ఋణానుబంధ మవి ప్రీతిన్ నేను జేకొంటచే.
వగతున్ నేఁ డవి నాఁడు వర్ధనమికిన్ బ్రహ్లాద! ఏకాత్మజా!

అని విలపించినాఁడు. ఒక యాంగ్లభాషనే కాక సంస్కృతాంధ్రములఁ గూడ నీబాలుఁడు చతురుఁ డగుచున్నట్లు

మ. కృతి కాదంబరి బాణపుత్రికుని మాడ్కిన్ మల్లికామారుతం
బు తెలింగించెద నుత్తరార్థమని వేల్పుంబాస నేర్వంగఁబూ
నితిగా వెంపటి వెంకటార్యునికడన్! నిర్భాగ్యుఁడౌ తండ్రికిన్
ప్రతిభావత్తనయుండు దక్కునటరా ప్రహ్లాద! ఏకాత్మజా!

మ. నవలన్ వ్రాసెద, దిద్దిపెట్టవలయున్ బాబయ్యగారంచు, నే
నవలం బింగలి సూరనార్యుగతిఁ బిత్రానందముం గూర్తునం
చవకాశంబులఁ బల్కుచుందుగద యన్నా! మున్న చేకొన్న యా
నవలన్ నన్నును బాసిపోయి తెటకో ప్రహ్లాద! ఏకాత్మజా!

అను పద్యములు తెలుపుచున్నవి. ఇతఁ డింతవంట యగుటచేతనే

శా. చాలన్ బాల్యమునందె యాంధ్రపు సమాజంబందు నీ వెంతో ధా
రాళప్రక్రియఁ బద్యము ల్చదువ వార్తాపత్రికల్ ప్రోసి నా

మేలౌ వా_స్త. తదాకృతిన్ జగతిలో మెప్పొందెదం జుండఁగన్
వ్రాలెల్ నీస్మృతి యాంధ్ర కేసరి నయో ప్రహ్లాద ! ఏకాత్మజా !

మ. తొలుతన్ నీ వుదయించినప్పు డుపనీతుం జేయనున్నపుఁ డెం
డిలి గావించెడునప్పు డా ప్రతతికిన్ నే వ్రాసితింగాని లే
కలు నీ చావెతెఁగింప. ఐన నది దాఁగన్ నేర్చునే ? బందులున్
బలుమిత్రుల్ నినుఁగూర్చి వ్రాసెద రిదే ప్రహ్లాద ! ఏకాత్మజా!

అని యనేకధా యలమటింపవలసివచ్చినది. ఎంతయలమటించినను సుంతలాభమును లేదు గాన సూరియగు సుబ్బారాయఁడుగారు

మ. భవదీయోగ్రవియోగవహ్ని పరితప్తస్నేహభంగంబులన్
పవలున్ రేయును వేఁగుచున్ వెడఁగనై పల్మాఱు నిన్నెంచుచో
అవిరామంబుగ నశ్రులొల్కు. అధికానర్థంబుగా నింక నా
ప్రవిలాపంబులు మాని యీశుఁ దలఁతుం బ్రహ్లాద! ఏకాత్మజా!

అని శాంతిపాఠమును సలిపియుండిరి. అపద్యముల యందము కొంత దిగువఁ దిలకింతురుగాక.

శా. వా యొండం దడ వావురావురనుచున్ వాపోవఁగన్ ముద్దుకై
తాయంబిచ్చియు నవ్వుచో నది వెసం దా లాగి చేబిడ్డ నెం
తో యేడ్పించెడు తండ్రిపోల్కి మును నన్నోదార్ప నీవిడ్డ యా
నాయన్నుంగొమరున్ హరించితివె కృష్ణా ! ఆపదుద్ధారకా !

శా. ప్రియముల్ నా కనుకొన్న వెన్నొ బహుధా వేధింపఁగానయ్యె. ఆ
రయఁ దత్కారణ మస్థిరార్థములపై రాగంబకాఁ దోఁచె. ఈ
లయమొందంగల యెల్లవస్తువులఁ గల్లాఁ దలంపించి య
వ్యయునిన్ నిన్ మరగించి సౌఖ్యమిడు కృష్ణా! ఆపదుద్ధారకా!

మ. సకలంబైనజగంబు మృత్యువునకున్ సాయంబు గావింప ని
ష్టికరుండైనను జీవవత్సమున నీవుం టింతియే చాలు. ర
క్షకమై యున్నను మున్ జయద్రథున కక్షౌహిణ్యనీకంబు ను
త్తక మంకింపఁడె వాని దర్జునుఁడు కృష్ణా ! ఆపదుద్ధారకా !

మ. ఇలయెల్లన్ నశియించి యెల్లభువనం బేకార్ణవంబౌ మహా
ప్రళయంబందుఁ గరాంబుజంబునఁ బదాబ్జంబున్ ముఖాంభోజ సం

కలితంబుం బొవ్వరించి యీజలముపైఁ గందట్లు మఱ్ఱాకు నున్
దలిమంబందు శయింతు వీవెకద కృష్ణా! ఆపదుద్ధారకా!

శా. ఆకాశంబునకంటె దేవ! ప్రతిబింబాకాశ మత్యంత ర
మ్యాకారంబున దర్పణాదికములో నాలోకనీయంబగున్.
రాకాచంద్రనిభాస్య! నిన్ మనములోనం జూచువారే ప్రమో
దైకావాలురటంచు నెంచెదను గృష్ణా! ఆపదుద్ధారకా!

కమలావిలాసము— శృంగారప్రబంధము. సరస్వతీగ్రంథమాల 39 పుష్పము. గ్రంథకర్త వఝ్ఝుల వెంకటేశ్వరకవి. సరస్వతీగ్రంథమాల సంపాదకుఁడు కాకరపర్తి సత్యనారాయణమూర్తిగారు. కాకరపఱ్ఱు. వెల 0-12-0. ఈ గ్రంథమాలకు రేబాల పట్టాభిరామరెడ్డి జమీందారుగారు మొదలగువారు సహాయులయి యున్నవారు. ఈ కమలావిలాసమందలి

చ. జనకుఁడు బాల్యమందు నెలజవ్వనమందు విభుండు వార్ధకం
బునఁ దనయుండునున్ మిగులఁ బ్రోచుచుఁ జూచుటఁజేసియెప్పుడున్
వనిత స్వతంత్రహీనయని పల్కరె పెద్దలు? కాన నింక నా
కు నెవరుదిక్కటం గలరొక్కో? అకటా! అబలామణింగదా!

అను పద్యమువలన గ్రంథకర్త స్త్రీస్వాతంత్ర్యమును గోరు నవనాగరకుఁడు గానట్లు కనఁబడియెడిని. ఇట స్వతంత్రహీన విచార్య

సీ. ...నాఁడు ప్రేమాలేఖ నాకుఁ బంపింపఁగా
సంతసించితిని ప్రేమింతువనుచు

ఇందలి ప్రేమాలేఖయు నిట్టిదే. పత్రియు మన్మథోత్కళికలు భవమద్వంశము లోనగు కవియు నంతప్రశస్తములు కావు.

చ. విలసిలునట్టి కొండలన వెల్గు పదాఱుపసిండివన్నెలన్
కులుకుమిటారి గబ్బిచనుగుబ్బల మధ్యఁ దనర్చు త్రోవలో
బిలమను నాభినుండి కడువేగమ యేగెడునట్టి నల్లచీ
మల నను బారుతీరనఁగ మానిని యారు దనర్చు నెంతయున్.

ఇందలి కల్పన చక్కగానున్నది. ఇట్లే

సీ. అధరంబు సుధవోలె నధికంబు మధురంబు,
మోము శారద వెల్గు పూర్ణసోము,
కలనేత్రముల్ నూతనాంభోజపత్రముల్...

అని చాలపద్యములు చక్కనిధారలో నడపి శృంగారము చూపఁబడినది. కాని యనుమాన మెదియు లేకుండ ననేకములు కొనసాగినట్లు గోచరింపదు.

కమలామనోహరుల గాథ యిది. కల్పితము. వీరిరువురకును వివాహము గలుగుటయు

శా. బాల్యావస్థ మొదల్ పతివ్రతమె యేపద్మాక్షికిన్ ముఖ్యసౌ
శీల్యంబన్నది నాటియున్నదిసుమీ చిత్తంబునం గావునన్
కల్యబ్దం బనఁబోక యీకళిపశిక్షం బాపుమా దైవమా!
కల్యాణీమణికిన్ రయస్థితి నిఁకం గల్యాణముల్ గూర్పుమా.

శా. మూల్యం బెయ్యది నీదయాగతులకున్? మోదంబునం జిత్తవై
కల్యం బింతయు లేక యింతవఱకుం గాలంబు వెళ్ళెన్. విప
న్మాల్యా బింతటఁ గల్గె. ప్రీతి జనియింపంజేయుమా దైవమా!
కల్యాణీమణికిన్ రయస్థితి నిఁకం గల్యాణముల్ గూర్పుమా.

శా. మాల్యం బిద్ధర జన్మమెత్తుటయు. జన్మంబెత్తి జీవించు మ [చాం
ద్ర్య ల్యుక్తంబు నయుక్తముం దెలియ నోహో బాధకులా? బుద్ధి
చల్యం బేగునె? కాంక్షితంబులు కలిన్ శాంతించునే దైవమా!
కల్యాణీమణికిన్ రయస్థితి నిఁకం గల్యాణముల్ గూర్పుమా.

అని పాతివ్రత్యప్రకటన పురస్సరముగాఁ గవి కల్యాణీమణియగు కమలచే భగవత్ప్రార్థనముఁ జేయించినాఁడు. బాగుగానే యున్నది. కాని మాల్యశబ్దార్థ మెదియో మదికి గోచరముగాదు.

కం. నాథుండిట మృతినొందె విరోధాధిపు లేమిసేతురో యనుభీతిన్
శ్రీధరుని సేనలెల్ల నహా! ధైర్యముపీడి పాఱె నచ్చట నుండిన్.

ఈయుండి కలగాక ద్రుతముగూడ నగునుగాఁబోలు! ఎక్కడనో యొక్కెడఁ దప్ప నిం దరసున్నలు శకటరేఫలు పాటింపఁబడినవి కావు. కొన్ని యవసర స్థలముల లేకయు ననవసరస్థలముల వేయఁబడియు నున్నవి.

గోచారదర్శని—ప్రాచీనఫలజ్యోతిషగ్రంథాదులనుండి లోకోపకారార్థము సంగృహీతము. ఈగ్రంథమునకుఁ జల్లా లక్ష్మీనృసింహశాస్త్రిగారిచే నాంధ్రటీకా తాత్పర్యములు వ్రాయఁబడినవి. ఏతన్ముఖపత్రస్థ "గోచారదర్శనీ దృష్టా సమ్యగ్గురులింగధీమతా, ఆంధ్రటీకాచ సంశుద్ధా కృతా లోపాయ సూరిణాం" అను శ్లోకము నోరి గురులింగశాస్త్రిగా రీగ్రంథమును సంస్కరించినట్లు చెప్పుచున్నది. కాని యది నిజమైయుండదు. ఇందలి టీకాతాత్పర్యములే కాక శ్లోకములుగూడ సుష్ఠువుగా

లేవు. గురులింగశాస్త్రిగారివంటి కోవిదులే దీనిఁ బరిష్కరించిన నిట్లుండదు. పై పెచ్చు సమ్యగ్గురులింగధీమతాయను పై శ్లోకపాదమే పాడయినది. ఇయ్యది ముప్పదియొక్క సం॥ల నాఁడు ముద్రితము. చల్లా లక్ష్మీనృసింహశాస్త్రిగారు స్మార్తానుక్రమణిక పురాణోక్తప్రకాశిక విషామృతమహోదధి మొదలగు స్మృతి పురాణసిద్ధాంతగ్రంథముల సిద్ధముచేయించి బహుకాలమునుండి బందరు బచ్చుపేటలో విక్రయించుచుఁ బరమోపకారము గావించుచున్నారు. ఈగోచారదర్శినిలోఁ బ్రతిగ్రహగోచారఫలములును బాగుగా వివరింపఁబడినవి.

మఱియు రాశినిరూపణము మూర్తినిర్ణయము మొదలగునవి చేయఁబడుటయే కాక రాశిగుణములు గ్రహముల యాదిమధ్యాంతఫలములు శాంతులు సంవత్సర మాస దశా ఫలములు విప్పి చెప్పఁబడినవి. శాంతుల యావశ్యకత చక్కగా నిరూపితము.

గౌరీపరిణయము— ఇది గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా మోర్జమపాడు గ్రామనివాసియగు తంగెడ రామకృష్ణామాత్యకవిచే విరచితమైనప్రబంధము. ప్రబంధమున కుండఁదగిన బహువిధవర్ణనములు గలిగి బాగుగాఁ బ్రకాశించుచున్నది. స్కాందపురాణస్థ శివరహస్యఖండములోని కథాభాగముం గైకొని యీగౌరీపరిణయము ౫ ఆశ్వాసములుగా నమర్పఁబడి యిప్పటికి 34 సం॥ నాఁడు 1902 లో ముద్రితము. గ్రంథకర్త యాకాలమునఁ బలనాటిలోఁ బ్రౌఢకవి. ఆంధ్రకావ్యాదులలోని యనేకపద్యము లాయనకుఁ గంఠస్థములై యుండెడివి. ఆపద్యముల నన్వయించు శక్తిగూడ నాయనకుఁ గలదు, అప్పకవీయాదిఛందోలక్షణగ్రంథములను జక్కగాఁ జదివి మంచి వక్తయై యుండెడివాఁడు. ఈయన కవితాధారయు మెన్నఁదగినదే. ప్రాచీనకవుల పోకడలే ప్రాయికముగా నీయన కవితలో నగుపడెడిని. కాని సంస్కృతపాండిత్యము చాలఁ దక్కువ. వ్యాకరణజ్ఞాన మధ్రికుసుమము. ఈయెల్ల సంగతులును నీగ్రంథములోని కర్తృవంశావళింగూర్చిన

సీ. శివకేశవాంఘ్రి రాజీవపారాయణో
ద్వేల ధీశాలు లార్వేలవారు.
వేదశాస్త్రపురాణ విమలవిద్యాజ్ఞాన
శీలస్వభావు లార్వేలవారు.
ఆత్మరాజన్య రాజ్యావనోపాయ వ
ర్ధిష్ణుప్రధాను లార్వేలవారు.
ఘనరాజదుగ్ధాబ్ధి కాసీనసురశాఖి
విజితప్రదాను లార్వేలవారు.

అట్టి యార్వేలవారిలో నతిశయిల్లు
ధరణి శాండిల్యగోత్రసంభరణులైన
తంగెడాన్వయులకు వాసతన౯ జెలంగు
స్థానముఖ్యాంశములు దెల్పఁబూనినాడ.

మొదలుగాఁగల పద్యములు విదితముచేయుచున్నయవి. ఈపద్య ముత్తర రామాయణములోని కంకంటి పాపరాజు పద్యమందలి పోకడతోఁ బోయినది కాని యంత ప్రౌఢమును నిర్దుష్టమును గాలేకపోయినది. శివకేశవుల నామములు పారాయణోచితములు కాని యంఘ్రిరాజీవములు కావు. అవి పూజ్యములును ధ్యేయములును. స్వభావశబ్దము నిరర్థకము. ఆర్వేలవారు ప్రదానముచేఁ గానీనాదుల జయించువారలని కవి యభిప్రాయము కాని పదప్రయోగముమాత్రము కానీనసురశాఖివిజిత ప్రదానులని వారిచేతనే వీరి ప్రదానము జయింపఁబడినట్లు చేసినాఁడు. ధరణి యన వసరము. సంభరణులు చక్కఁగా లేదు. వాసతననుచోట వాసమై యని యుండుట మంచిది,

తంగెడాన్వయులకు వాసమై చెలంగు పురము మొదలైనయవి తెల్పఁబూనినాఁడనని పూర్తియైనచో నీపద్య మెంతయు శోభించెడిని. మచ్చున కీయొక్క పద్యమే కనఁబఱచితిని గాని గ్రంథమంతయు నిట్లే యున్నయది. ఇవి సవరింపించి పునర్ముద్రణ మీకాలమునకుఁ దగినట్లు చేయించినయెడల నియ్యది ప్రాచీనప్రబంధముగనే భావింపఁబడునుగాని యద్యతనగ్రంథముగా నగుపడదు. పలనాటి నంతటిని బూర్వము రామరాజువారను నియోగిబ్రాహ్మణులు పరిపాలించియుండిరి. ఆరామరాజువారిలో జంగమయ్యయను నాయన యేతద్గ్రంథకర్త వంశమునకు మూలపురుషుఁడగు వీరేశలింగమంత్రితో వియ్యమంది 44 గ్రామములుగల తంగెడపరగణా దేశపాండ్యాధికార మొసఁగుటయు నప్పటినుండియు వారు తంగెడపట్టణ ధాములుగా నుండుచు వచ్చిరఁట. వారికాలముననో యంతకుఁ బూర్వము మఱొక రెడ్డిరాజుకాలముననో కాని యాతంగెడపురి గొప్ప కోటచేతను నగడ్తచేతను రక్షితమై యనేక రాజభవనములచేతనేకాక దేవాలయములచేతఁగూడ దేదీప్యమానమై యుండినట్లు జనశ్రుతియే కాక తత్తచ్ఛిథిలభాగము లిప్పటికిని జూపట్టుచున్నయవి 108 దేవాలయములే యుండెడివఁట. ఇప్పటికిని బాడువడి యయ్యవి యీక్షింపఁబడుచున్నవి. ఆ వీరేశలింగమంత్రి యనంతర మెన్నవపురుషుఁడో యేమో కాని లచ్చిరాజను నొకరిని దీసికొని తదాది తనవఱకు నీగ్రంథకర్త వర్ణించియున్నవాఁడు. రానురాను రామరాజువారి యేలుబడితోపాటు తంగెడవారిదికూడఁ దగ్గిపోయి యుండవచ్చును. ప్రకృతము తత్తద్గ్రామాధికారులుగామాత్రమే తత్తంగెడవంశజులు తవరుచున్నవారు. కాని కొన్నిగ్రామములలో నుద్యానవనాదులు తంగెడవారి పేరుతో శిథిలములయియుఁ గాకయు నిప్పటికిని గనుపట్టుచున్నవి. తంగెడపరగ

కాక దేశపాండ్యాలై తంగెడధామములగుటచేతనే వీరు తంగెడవారయి యుండఁ బోలు. ఈగౌరీపరిణయమునఁ గేవల గౌరీపరిణయమే కాక యాగౌరీశంకరుల కుమారోదయము నాకుమారుఁడు శూరపద్మ సింహవక్త్ర తారకాసురుల వధించుట గూడ వర్ణింపఁబడినవి. ఈకవి యొక్క గ్రామకరణమయ్యు మహైశ్వర్యవంతుఁడై యనేక భోగముల ననుభవించి యేకపుత్రుఁడైనను నెంతయుఁ బ్రశంస్యుఁడైన నరసింహరావుగారికిఁ బుత్రపుత్రికలు గలుగుటకును జీవించి సుమా రేడెనిమిదేండ్లనాఁ డింద్రనగర మలంకరించెను.

---

## —♦ బ్రాహ్మణద్వేషమువలన హిందూసంఘమునకుఁ గల్గిన హాని ♦—

(ఆర్. రామారెడ్డిగారు, దైవమదిన్నె)

మహాశయులారా!

నేఁటి నవనాగరకకోటిశకమున బ్రహ్మద్వేష మొక్కరూపమున ఖండఖండాంతరములలో సహితము తారకమంత్రమునకన్న సదుపాస్యమై పెచ్చుపెరుఁగుచున్నది. దీనికి సనాతనవిద్యాగంధశూన్యులై యాచారభీరువులై పతితాచారపారగులై సంఘబలమున నజేయమైన బ్రాహ్మణ్యము నవరంధ్రములు మూసి తత్స్థాన మాక్రమింపఁగలమన్న యుబ్బులాఁగు బ్రాహ్మణేతరసోదరుల హ్రస్వదృష్టియే కారణము. బ్రాహ్మణులు స్వార్థపరులనియు వారి యుచ్చస్థితికి మన నధఃపతితులఁ జేసిరనియు నధికారలాలసులనియు విద్యలలో నగ్రస్థాన మెక్కిరనియు నొక్కివక్కాణించు నేరములుఁ బ్రాచీనచరిత్రల తాఱుమాఱులు నించుక విచారణమునఁ గందకున్నను పృథ్వీరాజ నంద మౌర్య్య విక్రమార్క భోజ హర్షాశోక చోళ కాకతీయ వేమ మనుమసిద్ధి కృష్ణరాయ శాలివాహనప్రముఖ వివిధపరిపాలనాపరివర్తనలలోఁగల నిజమరసిన వారివారి పాలనములలో బ్రాహ్మణసాచివ్య పాండిత్యములె ట్లుపయోగించినదియు జగద్విదితము. స్వార్థత్యాగులై స్వామిహితార్థులై ప్రాణములుసహితము సమర్పించుటకు వెఱవని వీరశేఖరులై ప్రభువులకొఱకుఁ దాము [illegible] పోరిరి. హిందూదేశపు ధనవైభవములఁ గొల్లగొట్టినట్లు సనాతనమతమునుగూడఁ జూరలాడ నరుదెంచి వీరవిహారముగఁ దాండవించిన గజనీ మహమ్మదు మొదలగువారి దండయాత్రల నిజముగ బ్రాహ్మణులే యెదురై తామిడుమలు గుడిచియు మతములు గాపాడిరి. ప్రభుత్వముఁ జెక్కుచెదరనీయక నిద్రాహారములు విడిచి దివారాత్రములు బైరాగులై యెందఱెందఱెంతసహాయ మొనరించిరో పరిగణింపుఁడు. అట్టి సంరంభములలో నిజముగ సాధ్యతగల బ్రాహ్మణసాచివ్యము లలవడకున్న మనదేశము మతములు వైభవముఁ బేరైనను లేక యెన్నడో యేమహమ్మదీయులలోనో లీనమై శ్లేష్మమునఁజిక్కిన యీఁగలవలెఁ గదలలేక పడియుండెడివి. వేయేల? రాక్షస చాణక్య రుమణ్వంతులు వసంత

యీగంధరవిద్యానాథ విద్యారణ్య శంకర రామానుజానందగిరులు తిక్కన యక్కన మాదన తిమ్మరుసు మొదలగు ప్రతిభాశాలులు మతాచార్యులుగను మంత్రిశేఖరులుగను నిలిచి మోహరించి పరిపంథిమతముల కెదురొడ్డి ప్రజలను సామ్రాజ్యములను జెక్కు చెదరనీయక పరస్పరానురాగములం బోషించి విరోధుల తలచూపనీక కాపాడిరి. చంద్రగుప్తుం డెన్నిజన్మములకు నిజముగం జాణక్యుని కష్టములకుం బ్రతిక్రియ యొనరింపంగలండు? సామ్రాజ్యపరిక్షీణతలోంగూడం దనుఁబొలి కై పోరాడి యభియోగముల పాలై దిక్కులేక మరణదండనకు లోనయ్యు వధ్యశిలమీఁదం దలఁజేర్చి ఖడ్గమెత్తినపుడుగూడం జంద్రగుప్తుని మంత్రిత్వ మంగీకరింపక చావునకుం దెగించినమంత్రిరాక్షసునకు నందవంశ మెంత యిచ్చి బాకీ తీర్చుకొంగలదు?

శ్లో. నభీతో మరణాదస్మి కేవలం దూషితం యశః
విశుద్ధస్యహి మే మృత్యుః ... ...

అని వధ్యశిల నికటమునంగూడ జడియక పలికిన రాక్షసుండు సామాన్యుండా? స్వార్థపరుండా? బ్రాహ్మణేతరమౌర్యవంశమునకు హానిప్రదుండందురా? అమహాయోధుం డీయల్పాల్పమతభేదముతో మౌర్యుల విరోధించెనా? చంద్రగుప్తుని తండ్రి కుతంత్రములు భరించి నందసామ్రాజ్యమును గాపాడుచుం గుటిలుండైన మౌర్యసేనాని దురధికారద్వంద్వప్రభుత్వప్రణాళికను జిటికెలో నటుమాయ మొనర్చి సమయమువచ్చినప్పుడు చంద్రగుప్తు నెంతగమన్నించె? ఎట్టియభయ మిచ్చె? సామ్రాజ్యగ్రహణ మీచంద్రగుప్తుని గమ్యస్థానము. దానిం గాపాడుట రాక్షసమంత్రి ధర్మమగుటతో విరోధించెననుట స్పష్టమేకదా! ఆత్మలాభకాంక్షి రాక్షసమంత్రి యైనను నతనినే చంద్రగుప్తుని మంత్రిత్వమునకుం బిలుచుచున్న చాణక్యుని నిరసించి చావునకైనం దెగించునా? ఇట్టివానినే చంద్రగుప్తుని మంత్రిగ నభిముఖీకృతునొనర్చిన చాణక్యుని శక్తి సామాన్యమా? చాణక్యుం డీమౌర్యవంశస్థాపనాచార్యత్వమున గడించిన లాభ మేమున్నది? సురేశ్వరాంశసంభవుండగు సుధన్వుని సభలో వేదప్రామాణ్యవాదమున నెల్లర డీకొని శ్రీశంకరభగవత్పాదావతరణనాటకనాందిగాం బ్రచండవైతండికుల నణంచి దిగ్విజయరూపమున వైదికధర్మమును నెలకొల్పిన భట్టపాదాచార్యులవా రేమిలాభ మపేక్షించిరి? ఇటులే విమర్శించినం బ్రతిసామ్రాజ్యములోను వారివారి యథాశక్తి తోడుపడి వారి యాహారములకో విహారములకో విద్యావినోదములకో పోషణ మపేక్షించుటయు మహారాజులు కటాక్షించి రక్షించుటయుం గలుగుచుండెను. కార్యక్రమమం దాటగవ్వలవలె వారివారి కొలఁదు లెఱింగి యుపయోగించికొనుచు సామ్రాజ్యముల పాదు కదలనీయక రాజులు మంత్రులు నన్యోన్యాలంకారభూషితులై యొసంగిరే కాని పైనేరములకు బ్రాహ్మణులలోనై వారుచెడఁగొట్టిన సామ్రాజ్యము లేవియో యెవరాక్రమించిరో వ్రేలెత్తి యిది యని మచ్చునకైనం జూపంగలరా? ఒకవేళ సన్మానింపని రాజు లుండిన నుదరపోషణమునకు నాత్మవికసనమునకు మాత్రము వృత్త్యంతరాశ్రయణ మాపద్ధర్మమున

నవలంబించుచుండిరి. కాని నిజముగ వారీర్ష్యాళువులై యెవరిని సాధించిరి ? కౌపీన
మాత్రు లేమిసాధింతురనియా ? ఇంద్రుని శపించిన గౌతముని వింధ్య నణఁచిన యగ
స్త్యుని విష్ణువును నిగ్రహించిన భృగువును హరిశ్చంద్రుని వేధించిన గాధేయుని వస
ము నమ్మకున్నను వారికిఁగల విద్యావినోదములచేనైనఁ బరరాజుల నానందింపఁజేసి
వారి మూలముననైన నపాయమును దెచ్చిపెట్టి సాధింపఁదలఁపరా ? బలహీనులయ్యు
క్షుద్రులు బలవంతుల నవకాశముగల్గించుకొని పగదీర్చుకొనువా రెందఱు లేరు ?

బ్రాహ్మణుల కివియేవియు నెప్పుడు నక్కఱలేదు. పోషించిన హితమతులై
రాజ్యాంగమును నడపిరి. లేకున్న నేవిద్యలవలననో హితనిశ్వాసములతో మెలఁగిరి.
అదియు జరుగకున్న నేచిన్న యుద్యోగములో దయతో నవలంబించి జీవనము సేయు
చుండిరి. అవియు నీయకున్న వారి విద్యలనే భృతికుపయోగింపఁజొచ్చిరి. అప్పటికిని
జాతిద్వేషమే హెచ్చుపెరిఁగిన శిరసావహించిరి. కాని యిన్నిటికి నాలంబనమైన ప్ర
భుత్వమిత్రమండలినిగాని బ్రాహ్మణేతరసంఘములనుగాని వారు శపింపఁజొచ్చిరా ?
లేక చచ్చిరా ? కాక పరాక్రమించిరా? పోనీ ద్వేషించిరా ? ఏవో మాపాట్ల
కూటికనుకూలమైన చేతిపనులైనను వెదకెదమనుచుండిరి. ఇదంతయు శాంతము
కాదు బలహీనత యనుదమా ? అట్లే యనుఁడు. అంతటి నిస్సారులపై మనకుమాత్ర
మీ యకారణవైరమేల ? ప్రభుత్వమువారు బ్రాహ్మణులయందలి యభిమాన
శూన్యత గుప్తముగా నుంచి వేధించుట చాలక యుద్యోగము లీయఁగూడదనుశాస
నమునే ప్రతిపాదించి తేటతెల్లము చేసిరి. బ్రాహ్మణేతరస్వసంఘాసూయ మూలమునఁ
బ్రజాభిమానముగూడ బ్రాహ్మణులకు దూరమైనదని తెలియవచ్చెడిని. ప్రజలును
బ్రభుత్వము నుభయులు విరోధించి తమ్మొరయుచున్నను బ్రాహ్మణానా మనేకత్వ
మనునభియుక్తోక్తిప్రకార మాత్మసంఘీభావమైన లేక ప్రత్యేకవ్యక్తితతోఁ బ్రపంచము
నఁ దలఁజూపి బ్రదుకుటను దైవికీశక్తిసంపన్నమైన యాబ్రాహ్మణజాతికేఁదక్క మఱి
యొకరికి శక్యమా ? కనుక వారు స్వాయత్తజీవనులయ్యు సాత్వికముతోనే పరోప
ద్రవకారులు కాకుండుట నిర్వివాదాంశము. ఇఁక స్వోదరపోషణమున కాపద్ధర్మ
మున వృత్త్యంతర మవలంబించుచున్నారనిన నదియు దోసఁగా? ప్రజలతోను బ్రభు
త్వముతోను నింతటి వైపరీత్యము మఱియొకజాతి కేర్పడిన వారు బలహీనులయ్యుఁ
గ్రుద్ధులై తాము చచ్చుట యితరులఁ జంపుట లోనగు నేమేమియకార్యములకు సాహ
సించియుందురో గమనింపుఁడు. ఆత్మసామ్రాజ్య మవ్యాహతముగ నడచుచున్న
సమయమున నేపద్మనాయకులకో కొంచెమెక్కువమర్యాద ప్రతాపరుద్రుఁ డిడెనని
యసూయ లోలోనఁ దాల్చియు వెలిపుచ్చక సేనానియైన బొబ్బారెడ్డి తక్కినయోధు
లితరకార్యములతో దూరముననున్న యసమయమున రాజు యుద్ధసమయమిది కాదని
రాజీకిఁ దట్టాడుచుండ శత్రుయవనుల హితైషియై మోసగించి కాకతీయసామ్రాజ్య
మునకుఁగలిగించిన చేటు గాఢాపరాధము రాజద్రోహము మనయాంధ్రదేశ మెన్ని
నాళ్ళకుఁ ద్రిప్పుకోఁగలదు? ఏనీచుఁడైన నాజన్మద్వేషతురుష్కముష్కరఘోరసం
గ్రామసముద్రముప్పొంగిన నాత్మద్రోహము పాటింపక యంతఃకలహములకొఁ

కనుమానించు రాజు ననికిఁ బ్రోత్సహించి తాను శత్రువులలో దూరి దేశసామ్రాజ్యము నధోగతిపాలొనర్చెనా? కోపముతోఁ గోసిన ముక్కు పశ్చాత్తాపముతో రాదనునట్లు మహాసామ్రాజ్యమును రూపుమాపఁజాలెనుగాని నిజముగ నిట్టి బొబ్బిరడ్డు లెందఱెన్నాళ్లు తపస్సు లొనరించి యంతటిసామ్రాజ్యమును గడింతురు! ఇంతయేల? నేఁటికిని స్వల్పకారణములతో నేబంధువులో యేనీచసంఘకర్తలో యేస్వల్పోద్యోగులో శేషించియున్న సామ్రాజ్యములకు వేరుపురుగులై నిర్నిమిత్తముగఁ గలిగించు గాఢాపరాధము లే బ్రాహ్మణులు నెన్నఁడుఁ గలిగింపఁజాలరు. నేఁడుగూడ సర్. విశ్వేశ్వరయ్యప్రభృతులగు మంత్రిశేఖరులు వివిధపాశ్చాత్యదేశ నవనాగరకమహాసామ్రాజ్యములలో నగ్రస్థానముల నలంకరింపఁబడి ప్రశంసార్హులై మహీశూరపురాది సామ్రాజ్యములకు వన్నెగలిగించి యాదర్శప్రాయులై సజీవులై గోచరించుచు నేయున్నారు. సర్వవిధముల ననిష్టనష్టిదాయకమైన యీబ్రాహ్మణజాతిద్వేష మేలాభమును మనమందాసించి పైకిఁదీయుచున్నారో బోధపడుటలేదు. ధనము నధికారము మనదగ్గఱ నున్నందులకు విద్యాధనము బుద్ధిబలముఁ గల వారి సహాయమున లోకోపకారమార్గములను గనిపెట్టి బహుజీవనాధారకార్యక్రమముల నెలకొల్పి మనవలన వారు వారివలన మనము నూర్జితపడుట మాని మనలో నేయొకటి వర యక్షరాస్యులో స్వసంఘములలో విద్యావంతులని భ్రాంతిపడు స్వజనులలో నుత్తరకుమారప్రజ్ఞలుగ నుపయోగించు చిలుకపలుకులు సక్రమాభివృద్ధియై మన బలము మన యుపయోగము మన మెఱుఁగక పరులకు లోఁగవలసినదాఁక నిపతితులమైతిమి. పాలకు లొకప్రక్కఁ బ్రాచీనవిద్యల నిరసించి సూక్ష్యకొఱకుఁ జిత్తుచరిత్రల నుపపాదింపించుచుందురు. వేఱొకప్రక్కఁ జిక్కిన యముద్రితగ్రంథ తాళపత్ర శాసన వైదికగ్రంథము లన్నియు విధివిరామములేక వారిదేశముల గ్రంథాలయముల నింపుదురు. రాజకీయవిద్యాధురంధరులను మనల నొవరించుచు వైజ్ఞానిక రసాయనవస్తుగుణశాస్త్రములు వారు పరిశీలించుసంస్థలఁ బండితుల ద్వారమునఁ గావింతురు. మనవారు చెట్టుదొక్కిన బాటసారివలె మతికలవరము తిరుగక యొకటే బాటనఁ జనుచు ధనము నధికారము సంఘము నిట్లు ద్వేషబీజావలంబనముగ నశింపఁజేయుచున్నారు. వారి విద్యాబుద్ధిబలములు మన ధన సదధికార సంఘబలములు నన్యోన్యప్రేమలతో సక్రమాభివృద్ధిపఱచి మణికాంచనన్యాయమున లోకోపకారమెంతయో కావించుట యడుగంటి గొప్పకలవరమున మునిఁగితిమి. జేబునిండ రూపాయలిచ్చి చదివించుచు మెచ్చుకొను తలిదండ్రులు తమపిల్లలు నీతిబాహ్యము లుపదేశించుచున్నారనినఁ బాపము వారిప్రాణము లెట్లుండును? తమబాలుఁడు లోకోన్నతుఁడే కాని పరిపడక లోకు లనుచున్నారని విద్యాగంధమెఱుఁగక పరులతో గ్రుద్దులాడుట కవసర మేర్పడిన వివదించినవారిని సాధించుటకు బాలుని యకార్యములకు రైతు తోడుపడవలసినవాఁడే. పరిణామదశలోఁ గదా ఫలవృక్షమా బూరుగువృక్షమా యనుచింత! అప్పుడు తెలిసినను దెలియకున్నను గలింగగంగు పశ్చాత్తాపమే. ఈ సరణిని నగ్రజాతిద్వేషము తలకెక్కి విజృంభించుచున్నది. విద్యాబలమున్నవారిని విద్య

కొఱకైన స్నేహించి మనమును సాధించి సమానతఁ బడయనెంచుట వృద్ధికౌ మూలలక్షణముగాని విద్వేషించి వారి కేమివచ్చుననియు మా కౌ ప్రాచీనవిద్య లా బ్రాహ్మణులు వారిధర్మములే బాగుగా లేవనియు దూఱిన సామాటల కేమియర్థము ?

శ్లో॥ హరినఖరవిముక్తా రక్తాసిక్తాహి ముక్తాః
పరిణతబదరాణీ త్యాదరే ణోపగృహ్య
సపది సరసి ధౌతాః ప్రత్యభిజ్ఞాయ ముక్తాః
పరికిరతి కిరాతీ హంత కాంతార ఏవ.

అనినట్లు మన మనభిజ్ఞులమై విలువ గుర్తింపక మన సనాతనవిద్యలను దద్విద్యాపారీణులను నిరసించి వారివలనఁ గలుగఁగల లాభమును బొందఁజాలమైతిమి. సదా విదేశీయులు మనతో నేకీభవించి పక్కతాళము వేయుచు వారిలో మహామహుల వశపఱచుకొని మదకరుల వశపఱచుకొని బరువులు మోయించినట్లు ఖండాంతరములఁ జేర్చి మన సనాతనార్షగ్రంథములను నించుకొని పఠించి ధనసంఘాధికారబలములతో విఱ్ఱవీఁగుచున్నారు. మనమో గుఱ్ఱపుఁదోళ్ళతో సత్తుగిన్నెలతో గాజుపెంకులతో నోటుకాగితములతో బైబిలితిహాసకథా కాలక్షేపములతో విదేశీయకథలతో, బాలబోధకపాఠములతో భాషాంతరవిపరీతసంస్కరణాలాలసులమై జాతిద్వేషములతో మేదరవాని చేతికిఁ జిక్కిన కోఁతిమ్మన్నలవలె ఖా రనినట్లు గంతులు వైచుచున్నాము. నయభయయుక్తులలో నాత్తి తేటి వేదవేదాంగాధ్యేతలైన పాశ్చాత్యపండితులు మాక్సుముల్లరుప్రభృతులు శ్రీవిక్టోరియా రాణి పారిపార్శ్వకులై యుండిన కాలమున నామహావ్యక్తుల కాదర్శప్రాయులైన తిలకమహాశయాదులు సకలభాషాభూషితు లిందు లేకుండిరా ? వీరియందు వారికి గౌరవము లేకుండెనా ? మొదటి యభియోగకాలమున నియమించిన నిర్బంధావాస మెఱిఁగినంతమాత్రమున నపీలోనరింపక పూర్వము వనే విక్టోరియా మహారాజ్ఞి విలియంహాండీ మాక్సుముల్లరులవలన విని తిలకమహాశయుని గౌరవార్థము మనమే విడిపించిన శాశ్వతముగఁ గీర్తియుండెడిదియునని యట్లు చేయలేదా? మాలవ్యా నెహ్రూ దాస ప్రభృతు లామాదిరి వారు కారా ? అవాంతరమతకక్షలతోఁ దరతరములుగ నాటంకపడుచున్న యీమూలచ్ఛేదులు ప్రత్యేకత నవలంబింపకున్న బ్రాహ్మణేతరకక్షయను తెఱ లేకున్న నెన్నఁడో స్వరాజ్యమించుమించు సాధింపలేకుండిరా ? మిత్రమండలివారు మనకుఁ బ్రసాదింపకుండిరా ? గాంధీప్రముఖు లిన్నివిధముల వర్ణసంకర మపేక్షించియు నష్టకష్టముల కోర్చియు మానప్రాణములు గోల్పోయియు సాధించుటకు దూరమగుచున్న హిందూస్వత్వము బ్రాహ్మద్వేషమే లేక మొదటినుండియుఁ గల పలుకుబడిమీఁద మందలించిన మన గాంభీర్యమును జూచి వా రెన్నఁడో దేవగిరిరాజు కాకతీయగణపతిమహారాజును బదేండ్లు జైలున నుంచినను జెక్కుచెదరకుండఁ బెచ్చుపెరుఁగుచుఁ దనరాజ్యము నే కబళింప నుంకించు తన్మహారాజ్యమండలి సేనానులకు సబహుమానముగ యువరాజగు నాగణపతిదేవు నర్పించినట్లు మనను మెచ్చియే ప్రసాదించి యుండురు. జాతిభ్రంశద్వార

మున నైకమత్యము సాధింతుమని హిందువులు డంకా బజాయించిననాఁడే వీరిప్రణాళికయందలి బలహీనతను విదేశీయపాశ్చాత్యతత్త్వవేత్తలు గుఱుతించిరి. కనుకనే మన పోరాటమునకు వారు లొంగక కాలము గడపుచున్నారు. నేఁడైనను జాతిమతద్వేషములు మానవలయునుగాని జాతిమతములు మనము మానినను నవి మానునవికావని గ్రహింపవలెను. ఎవఁడో యొకఁడు పతితుఁడైన వానిత్రోవ వేఱు. కాని వానివలె నివియన్నియు నేకగ్రీవమగుట కానిపని. కనుక సోదరులారా! మీమీజాతిమతముల వికసనమున కనువగు విద్యల నలవఱచుకొనఁ గృషిసల్పుఁడు.

జాతిద్వేషములకొనర్చు ఖర్చు సనాతనవిద్యల కేలయుపయోగింపరాదు? ఫలితము తేటపడదా? ప్రభుత్వాభిమానము బ్రాహ్మణేతరసంఘావలంబనముఁ గలిగియు ఘనోద్యోగసామ్రాజ్యము లొప్పియు నేలోపమున బ్రాహ్మణుల సమతను మన మెనయఁజాలకున్నాము? వారియందుండి మనదృష్టికి మిఱుమిట్లుగొల్పు లోకోత్తరవస్తువేది? ఏసహాయము లేక యెల్లరివిరోధములతో వారిలోవారి కైకమత్యము లేకున్నను వారిని బ్రతికించి జీవనోపాధినిచ్చుచు నండఁబాయని వీరకవచ మేది? వారి విద్య మనకు వచ్చుటకుఁ బ్రయత్నించుట వారిసహకార మపేక్షించుట శక్తికొలఁది వారి సంఘమునకు గురుభావమున నుదరపోషణమాత్రమైనఁ గావించుట లేదా పైపెచ్చు వారి కపకృతియైనను దలంపక లోకక్షేమకరులని యూరకుండుటైన మనయత్నములకు మనసంఘములకుఁ బునాదికాని మన మావ్యక్తులఁ బ్రతిరోధించుకొలఁది వారు శాంతముతోనే మనవిరోధులకు సహకారులు గాకున్నను మనద్వేషుల యాశయములకు వారి సహకార మనుత్క్షణాపేక్షణీయ గమ్యస్థానము గాదా? హ్రస్వదృష్టి వదలి బాహ్యతకొలఁది మనసోదరబ్రాహ్మణగౌరవమును గాపాడి లోకసుఖ మేర్పఱుపవలసినవారమై యున్నాము. మనప్రాభవములకు సహాయపడవలసినవారు బ్రాహ్మణులు. నేనింతటి వ్యతిరేకోపదేశమును మీకొనర్చినందులకు సోదరదేశీయులు మన్నింతురుగాక. మిత్రవాక్యమును విశ్వసించి మీరు సనాతనమార్గ మవలంబించిన మీరే భగవంతున కవతారశ్రమమును దప్పించినవారగుదురు. లేదా? శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత! పరిత్రాణాయసాధూనా మిత్యాదిగీతోక్తులప్రకారము వార్ష్ణిం గక్కఱలేకయే భగవంతుఁ డావిర్భవించి ధర్మసంస్థాపన మొనరింపఁ గలఁడు. కనుక క్షమించి మీమీచిత్తములలో నించుక వితర్కించి ధర్మమును చాటింపుఁడు. సనాతనస్థితులు గమనింపుఁడు. సర్వసాక్షియైన పరమేశ్వరుఁడు మీమీహృదయముల నధివసించి సుశిక్షితమైన మార్గమున నడిపింపుఁగాక. లేకున్న నాయన కర్మదౌర్బల్యమే యాయనకు జన్మకారణ మగుచుగాక. సమస్తప్రజలకు సామ్రాజ్యములకు మేలు చేకూరుఁగాక.

---

## —* గురిజాల సహస్రావధానము *—

సహస్రావధానమున జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారే జరిపియుండిరనునది జగద్విదితము. అష్టావధాని శతావధానిబిరుదము లసమర్థులుగూడఁ గొందఱు తగిలించుకొనుచున్నను సహస్రావధానిబిరుదధారణము మాత్ర మిదివఱ కెవ్వరికిని శక్యమై కనుపట్టదు. సహస్రావధానపంచాననులై సన్మానంబుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారే చూఱకొనుచున్నారు. ఆ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు యాదృచ్ఛికముగా గురిజాల కరుదెంచుటయుఁ బిన్నెలి నరసింహముగారు పెద్దపెద్దలతో యోజించి శాస్త్రిగారిచే సహస్రావధానము జరిపించిరి. ఆసభ యీనెల 2వ తేది యారంభించి 5వ తేది యాఖరు చేయఁబడినది. విద్వాంసులు, కవులు, ప్లీడరులు, గుమాస్తాలు, వర్తకులు మాష్టర్లు, డిస్ట్రిక్టుమునసబు, తహసీల్దారు మొదలగు నున్నతోద్యోగులు ననుదినము నాసభ కరుదెంచుచు వచ్చిరి. ఒక్కటి తక్కువలేకుండ వేయిప్రశ్నలు వేయఁబడినవి. సహస్రములో నెంబరుచెప్పి విషయమడుగుట సరళమైనసరణియైయుండ విషయము చెప్పి నెంబరుగూడ విశేషించి ప్రశ్నించిరి. లక్షలు వేలతో నుండు నంకెలపట్లఁగూడ వట్టే చేసిరి. ఆయంకెలలో సున్నలుమాత్రమే చెప్పుమనిరి. అంకెలు వరుసగాఁగూడఁగా నైనమొత్త మింత, అది యేనంబరనికూడ నడిగిరి. రూటు చెప్పి నెంబ రడిగిరి. అవియన్నియుఁ దప్పక చెప్పఁబడియెను. కొన్ని నెంబరులలోఁ బది పదియై దింగ్లీషక్షరములు వ్రాయఁబడియుండ నటఁగూడ రెండువిధములఁ జెప్పెను. అంకెలను గంప కాగితములను విడిచి తక్కిన బొమ్మలకు విషయములకు నడుగకుండ నవధానియే యనేకప్రత్యుత్తరములు పద్యములతోఁ జెప్పుచున్నను బ్రతిపృచ్ఛకుండఁ దుదకు బాలురుగూడఁ బద్యములే కోరుచువచ్చిరి. పద్యములలో సామాన్యవృత్తములే కాక పంచచామర మత్తకోకిలాదివృత్తముల నపేక్షించిరి. ఆకష్టమంతయుఁ జూచి యగ్రాసనాధిపతియైన నే నడిగినవారికే పద్యములు చెప్పి యన్యుల కడుగుండని యవధానిగారితో నన్నను యథాపూర్వముగనే యాచరించుచు వచ్చెను. అవధానసమయమందైనను నాయన కవిత్వమే రసవంతము. చూడుఁడు. (గంగాధరునిగూర్చి)

శా. రంగత్తుంగతరంగభంగనినదారంభంబు లొప్పంగ వ్రా
లంగన్ భూమికి గంగ భూప్రళయకాలంబౌట యోజించి తా
ల్చెం గంగాధరమూర్తి ఘోరభుజగశ్రీభాసిశీర్షుండు ని
స్సంగుండున్ విషఖాదశీలి గజరాట్చర్మాంబరశ్రీకుఁడై.

ఇట్టి రసవత్కవిత్వనిధాని నింకను నారసమనియు నీరసమనియు నాయలంకారమనియు నీయలంకారమనియు నేమేమో ప్రశ్నింప నందఱికి నన్నియుఁ జెప్పి

సీ. సామాన్యబుధజన సంగ్రాహ్యభావనా
వ్యాపారిసత్కథా భాసురంబు
లలితోపమాదికాలంకారభూషణ
భూషిత శయ్యావిభూషితంబు

కోసుమపేశల పదగుంఫనాసంరంభ
లలితభావోద్బోధ లాలితంబు
భవనీయకదళికాపాకాది గమనప్ర
చారసముల్లాస సంభరితము
సత్పదాప్తి నిరూపణాచారహితము
దోషరహితము విరసతాదూరితమ్ము
సజ్జనాహ్లాదకరమునై చనినయదియె
కవితయగుఁగాని యన్యంబు కవితయగునె ?

అని షహస్రవిషయములలో నొక్కఁడగు కవిత్వతత్త్వముఁగూర్చి చెప్పిన పద్యమును సార్థకముఁజేసెను. ఉపమోత్ప్రేక్షా ద్యలంకారములుగూడ వేయింటఁ గొన్ని విషయములు. అనెంబరు లడిగినపు డయ్యలంకారముల లక్ష్యలక్షణశ్లోకములుగూడఁ జదువఁబడియెను. ఈవిషయములలో నిరువది ముప్పది సమస్యలు. అవియు వత్యాశుధారలోఁ బూరితములు. ఇవి యెంతరసవంతముగఁ బూరించెనో యించుక వీక్షింపుఁడు.

క. భ్రాంతుం బద్మవ్యూహాక్రాంతుని నభిమన్యు గెడపి చను సైంధవునిన్
సంతతరణజితబహుశత (కుంతిం గృష్ణుండు నొక్కకోలం గూల్చెన్)

తే॥ గీ॥ అల విభీషణు నంపి నయంబు దెల్పి
వలనుపడదన్న విధిలేక పంక్తికంఠు
కఠినరాక్షసదుష్టవాక్యప్రలుబ్ధ
(కర్ణుఁ ద్రుంగించె రాముండు కాంతకొఱకు)

సహస్రములోని సమస్యలుగాక యింకను నెందలో యీఁగడఁగిరి. కపు అంబుల్ ముకుళించెనను సమస్య యిచ్చుటయేకాక

ఆ. మత్తగిల్లు సత్తుగిత్తతత్తడినెక్కి మిత్తిమొత్తి సత్తినత్తి బత్తి
బత్తిగిడిన ముత్తిబుత్తులు రెండును నొత్తి గుత్తగట్టుచుండు జేఁడ !

అనుపద్యమును సంస్కృతభాష మందాక్రాంతలో మార్పుమని పిఠాపుర సూర్యనారాయణశాస్త్రిగారు పెద్దపెట్టుఁ బెట్టుటయు నేర్పఱచుకొన్నవాని కెక్కుడు యీయఁదగదని యేను నిరాకరించితిని. కాని గుఱిజాల న్యాయవాదిప్రముఖులు సన్మానసంఘసభ్యులు నగుటచే స్వీకరింపక తప్పని జింకా సుబ్బారావుగారి సమస్య యొకటి చేరవచ్చెను. అప్పు డవధాని యీసమస్యలు రెండు నవలీలమై

కం. హితమగు యూవన మాయెను.
సతి పుష్పవతీత్వమొందె. సత్సమయమునం

దతిదూరక్షిత్యాగత
(పతి పతి గలయంగ నొక్కపట్టి జనించెన్)

మ. అమృతావాసిమనోజ్ఞభానునిచయవ్యాపార మేపారఁ జ
క్రిముఖంబు జిత్తము డిందువోవ సహజాకారైకసంచారవి
భ్రమసౌభాగ్యము కోలుపోయెఁ దమముం బాసెం గళల్ కోల్పడెన్
(కమలంబుల్ ముకళించె భాస్కరుఁడు రా గంధేభకుంభస్తనీ !)

అని పూరించెను. సూర్యనారాయణశాస్త్రిగారు పద్యవినిమయమునుగూర్చి బోధించిరి. అదిమాత్ర మనంగీకృతము. సహస్రమునకు మించిన ప్రశ్నలలో జాబిడిచిన దదొక్కటి. తక్కు నన్నింటికిని

మ. సువిమర్శాత్మక పాండితీగరిమముం జూపించు సద్వర్ణనల్
కవితావైఖరి యంకెలుం బనులు వేల్గాఁ జెప్పి తొల్దొల్తనే
కవిలోకంబున వేయియంశములఁ జక్కన్ జ్ఞప్తిసేయన్ సహ
స్రవధానంబగుఁ బృచ్ఛకానుమతమా చందాన వాకొన్న చోన్.

అని యేతదవధానములో సహస్రావధానవిషయమునఁ జెప్పిన పద్యమును సార్థకముఁజేయుచు జవాబుచెప్పిరి. సూర్యనారాయణశాస్త్రిగారు వేయింటికి మీఁద వచ్చి యర్థబాహుళ్యములేని యచ్చతెనుఁగుపద్యము సంస్కృతమున మందాక్రాంతగా మార్చుఁడని యడుగవలసినదే కాదు. అట్టిపట్లఁ గవులకుఁ గల కష్టము శాస్త్రిగారు విచారింపక ప్రశ్నించిరి. అఱువదేండ్ల వృద్ధులదగ్గఱనుంచి యైదేండ్లపసిబ్రవాని వఱకు నియ్యవధానములోఁ బృచ్ఛకులు. ఒకరికి జవాబు వచ్చువఱకు నొకరుండక యొకరు నిరువురు మువ్వురు నలువురు నొక్కటే మా అడిగి తొందరచేయుచున్నను నవధానిగారన్నిటిని సమర్థించి యాబాలవృద్ధము నాసభ నానందపెట్టిరి. వేయివిషయములు ధారణపట్టి విద్వత్కవిత వెదచల్లుచున్నను నాల్గుపాదములు నాల్గుసారులు చెప్పి పదపడి పద్యములన్నియుఁ బఠింపవలసిన బాధ్యతగల శతావధానమే చాలఁ గష్టమని సభ్యులు కొందఱు శంకించి యందుఁ బ్రీడకులగు బెల్లంకొండ సుబ్బారావుగారు సహస్రావధానములోని యొకవిషయమును జంపకమాలలో వర్ణింపఁగోరి నాల్గుపాదములు నాల్గుసారులు చెప్పించి యప్పటి కప్పుడైనంతవఱకును బద్యపూర్తియైన పదపడియుఁ బఠింపించి పరితృప్తి వెల్లడించిరి. అర్ధ్వస్నానమొనరించు నవనీశులో యర్థవంతులో యలవడవలెఁ గాని శతావధానభక్తిని సహస్రావధానము జరుపుటకును జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సమర్థులై యున్నారు. మల్లాది నరసింహమూర్తిగారీసభాకార్యక్రమమంతయు మంచిగా నడిపించిరి. సభావసానమునఁ బిన్నెలి నరసింహముగారు కన్నెకంటి ప్రభులింగాచారిగారు, అబ్బరాజు హనుమంతరావుగారు కావిపాటి లక్ష్మీనారాయణగారు నవధానినిగూర్చి యభినందనపద్యములు పఠించి యానందమును వెల్లడించిరి. వేయింటికి జవాబుచెప్పిన విద్వత్కవికి వేయినూటపదియాఱులిచ్చుటే విధియైనను నాఁటిసామర్థ్యమునుబట్టి నేఁటికాలానుసరణముగ నూట

ఉత్సవము పూర్తియైనదికాని వత్సను బోషించుటకే వ్యాకులపడవలసివచ్చెను. తల్లిస్తన్యముగ్రోలుటకుఁ దత్తనూభవుఁడు నోఁచి పుట్టమిని బదునొకొండవనాఁటి రాతిరే పాలబుడ్డి గొని తెచ్చితిని. చేతనైనపనిగనుక నాతీరు జరిపితినిగాని యర్భకున కా పాలుపోయుటకు మరల నన్యుల నపేక్షింపవలసివచ్చెను. ఆత్మ స్తన్యము గుడుపుట కస్మ దర్ధాంగి నోఁచదు సరికదా! పుత్రునకు బుడ్డిపాలు పోసికొనుటకుఁగూడఁ బూర్వకర్మ మడ్డుపడియెను. పదునొకొండవనాఁటి రాత్రినుండియే మెదుకు రుచింపకపోయెను. వాతము వర్ధిల్లెను. చెవుడు సిద్ధమయ్యెను. ఆ ట్లయోమయావస్థ యంతయు నావిర్భవించెను. అట్టిది యిఁక నాత్మజున కాచరించునది యేమి ! దానిత్రోవ దానిదే. వానిత్రోవ వానిదే. చంటిబిడ్డకుఁ జమురు రాచుటకుఁగూడ శక్తురాలుగాక యది యట్లు పడియుండుటయు నా శిశుపోషణభర మన్యులు వహింపవలసివచ్చెను. అన్యదేశభవయగుట దాని దగ్గఱచుట్టములు దగ్గఱ లేనే లేరుకదా! నాదగ్గఱచుట్టములుకూడ నా దురదృష్టవచ్ఛిశుపోషణమునకు యత్నింపరు. అటనుండు నా దగ్గఱచుట్టము లెవరు ? ప్రథమురాలు భ్రాతృపుత్రి. ఆతరువాతి దక్కబిడ్డ. కాని భ్రాతృపుత్రి దానిఁ బెంచి పెద్దఁజేసినదైనను బ్రేమించునదియైనను నత్యాచారవంతురాలు. అందువలన దానికిఁ బురిటివాండ్రపొడ గిట్టదు. పొడయే కాదు. ప్రసవగృహమునఁ బాదమే పెట్టదు. ఇఁక నక్కబిడ్డయో ? అన్యత్ర యాత్మీయగృహమం దుండునది. ఆయింటిపను లరయుచుండవలసినది. అన్య లరయువా రున్నను నంత శ్రద్ధ యద్దానికిఁ గలిగినదికాదు. అట్టిశ్రద్ధ యర్భకు నతిసమీపబంధువులకుఁ దప్ప నన్యుల కుండుటరిది. ఈయీకారణములచే నీశిశుపోషణబాధ యేమియు నెఱుఁగని నామీఁదనే వచ్చిపడియెను. ఇఁక నేనో

కం॥ ఇవతలనుండిన చెంబును
అవతలఁ బెట్టియు నెఱుంగ. అత్తైస రేనిన్
వివరముగఁ బెట్టు లెఱుఁగను.

అని వ్రాసికొనియున్నవాఁడను. వ్రాసికొనుటయే కాదు. వాస్తవముగనే యట్టివాఁడను. అట్టి

తే॥ గీ॥ ప్రకృతకాలపరిస్థితుల్ బాగుగా నె
ఱుంగనట్టి యమాయికపుంగవునకు

ఇట్టిచిక్కేర్పడుటయుఁ బట్టికిఁ బాలుపోయుటయే కాక యంగముల కాముదము రాచుటదగ్గఱనుంచి యాచరింపవలసివచ్చెను. ఎఱిఁగిచేసిన పనియైన నేభంగమును లేక శోభించునుగాని యెఱుఁగక చేసిన పని యిడుములకే యిరవయ్యెడిని. ఇట్లెఱిఁగియు నెఱుఁగక యెంతపాలపొడి వేసితినో యెన్నినీళ్ళు పోసితినో యేదియెట్లు చేసితినో యేమో కాని యేడుదినములు పాలు గ్రోలించుటయు నెనిమిదవ దినమున నే రోగమో యేర్పడెను.

పందొమ్మిదవనాఁడు 10 గంటలకుఁ బాలువోసి పడుకొనఁ బెట్టఁబడిన బాలకుఁడు భాస్కరుఁడు పశ్చిమమ్మున వ్రాలువఱకు మేలుకొనకున్నను హాయిగా నిదురించుచుండెనని యనుకొంటినిగాని యాథార్థ్య మరయఁజాలనైతిని. నిసుఁగు నిశ్శబ్దముగాఁ బడియుండుటకు నిబ్బరపడి పురిటింటఁ జరణమిడని యన్నబిడ్డ యవతలనుండియే వ్యాధి నాశంకించెను. చికిత్స చేయుటకు శీఘ్రపెట్టెను. అవి యివి పోసితిమి కాని వ్యాధి యంతకంతకు నభివృద్ధియే యందఁజొచ్చెను. అటో యిటో యారాత్రి గడచెను. ఇరువదవదినము పగలంతయు నెవ్వో చికిత్సలు చేసితిమి. అవతలనుండి యన్నబిడ్డ యెన్ని చెప్పినను నందనుని నోట మందువోయుపనికూడ నాతలనే పడనయ్యెను. మేనగోడలును దాని యాఁడుబిడ్డయుఁ దఱచు వచ్చి తగుసహాయము చేయుచున్నను నహోరాత్రములు నయ్యర్భకుని గనిపెట్టికొనియుండి, యవ్వో యివ్వో చేయుచుండుట యిట్టివానిమీఁదనే పడియుండెను. ఇరువదవదినము పగలంతయు నెట్లో వెళ్ళించితిని. రాత్రి నాపాలిటికిఁ గాళరాత్రియే యయ్యెను. కఱవులో నధికమాసమన్నట్లు గాలివానగూడ నారాత్రి సిద్ధమయ్యెను. వృక్షము లన్నియు విఱిగిపడియెను. పెళపెళారావములు పిక్కటిల్లెను. ఉఱుములు మెఱుములుఁ దఱచయ్యెను. అట్టిభయంకరమైన యారాత్రి యంతయు నయోమయావస్థయందున్న యర్ధాంగిని నాసన్నమరణుఁడైన యాత్మజుం గనిపెట్టుకొని పొక్కుచుఁ బురిటింట నొక్కండన పడియుంటిని. దీర్ఘకాలమునకుఁ దెల్లవాఱుటయు వీథులన్నియు వృక్షమయములై వీక్షింపఁబడియెను. పెక్కు రైలుస్టేసనులమీఁది రేకులు పేరునకు లేకుండ లేచిపోవునదియుఁ బెనుమ్రాఁకులే పెల్లగిల్లి తారాపథమునఁ దాండవించినదియు నెక్కడనిలిచిన గొఱ్ఱెమంద యక్కడనే యంతమొందినదియు నెటనో యున్న మనుష్యు లెటనో లేచిపోయి పడినదియు బెజవాడమొదలగుచోట్ల మేడలు విఱిగి మీఁదఁబడి యెందఱో మృత్యువశులైనదియు నీ తుపానునకే. క్రోధనసం॥ వైశాఖ బ॥ (19-5-1925) రాత్రి యీ ఘోరవర్షము కురిసి వెలిసినది. కొడుకు కొనయూపిరితోఁ గొట్టుకొనుచున్నాఁడు. [illegible] బ్రొద్దుపొడిచినది మొదలు యామద్యాయమువఱకు ననేకచికిత్స లాచరించి యాచరించి యంత్యమున కాశవదలితిమి. నాఁడు నక్షత్రము మంచిదిగామిని లోపల నూపిరిపోయిన లోగిలి వదలిపెట్టవలసివచ్చునని ప్రాణములుండఁగనే బాలుని బజారులోఁ బెట్టుకొని కూర్చుంటిమి. ఎవరెవ్వరు? నేనును నాభార్యయు. అది యస్మదనుభూయమానమగు నవస్థ యావంతయు నెఱుఁగదు. అంతవ్యాధితో నది యున్నది. వీథికి వెడలించునప్పటికి విన్నది కొడుకుస్థితి. తెలిసియుఁ దెలియని స్థితితోఁ గొడుకును దీసికొనివచ్చి యొడిలో వేయుమని యేమేమో పలవించినది. అట్టిపెండ్లమును నేనును నర్ధావశిష్టప్రాణుఁడగు నాత్మజుం బెట్టుకొని యామత్రియమువఱకు హాయని పడియుండ నప్పటి కవ్వాఁ డసువులు విడిచెను.

ఎన్నిరో వేడుకలు చేసికొనవలసిన యిరువదియొకటవదినముననే యీదురవస్థ సంప్రాప్తము. అగ్రమహిషికు నష్టమైన యష్టసంతానములను స్వహస్తములతో నే శ్మశానమునకుఁ గొనిపోకుండ జరుపుకొంటినిగాని చిన్నభార్య గన్న యీతొలిబిడ్డను మాత్రము చేతిమీఁదుగానే తీసికొనిపోవలసివచ్చినది. స్త్రీయు లెవరును లేని సికిం